# రాక్షసుడిని ఓడించిన చిన్నా

కిట్, తెలుగు: కె. సురేష్





అనగా అనగా ఒక దేశంలో

ఒక బాలుడు ఉండేవాడు.

అతడికి తొమ్మిది సంవత్సరాలు.

కానీ చూడటానికి చిన్నగా ఉండేవాడు.

అందరూ అతడిని చిన్నా అని పిలిచేవాళ్లు.

అమ్మా, నాన్న అయితే అతడిని ఏ పనీ

చెయ్యనిచ్చేవాళ్లు కాదు.

అతడు చాలా చిన్నవాడని అంటుండేవాళ్లు.



చిన్నా వాళ్ల నాన్నకి ఒక గుర్రం ఉంది.
కానీ చిన్నా వాళ్ల అమ్మ అతడిని ఆ గుర్రం ఎక్కనిచ్చేదా?
ఏమాత్రం ఎక్కనిచ్చేది కాదు!
"నువ్వు చాలా చిన్నవాడివి," ఆమె అనేది.
"నీకు దెబ్బలు తగలటం నాకు ఇష్టం లేదు."

చిన్నా వాళ్ల నాన్న దగ్గర విల్లు, బాణాలు ఉండేవి.
కానీ అతడు చిన్నాని వాటిని
ఉపయోగించనిచ్చేవాడా?
ఏమాత్రం ఉపయోగించనిచ్చేవాడు కాదు!
"నువ్వు చాలా చిన్నవాడివి," అతడు అనేవాడు.
"నీకు దెబ్బలు తగలటం నాకు ఇష్టం లేదు."





"నేను చిన్నవాడినే," చిన్నా అనేవాడు. "కానీ నేను కూడా పెద్ద పనులు చెయ్యగలను. ఏదో ఒక రోజు నేను ఆ విషయం నిరూపిస్తాను."

చిన్నా వాళ్ల దేశంలో ఒక రాక్షసుడు ఉండేవాడు. ఆ రాక్షసుడు చాలా పెద్దగా ఉండేవాడు. అతడు భోజనానికి 100 ఆవులను తినేవాడు. ఉదయం నాస్తాకి ప్రతి రోజు 100 గుడ్లు తినేవాడు.





ఆ రాక్షసుడు ఆవులన్నింటినీ తినెయ్యసాగాడు,
గుడ్లనన్నింటినీ తినెయ్యసాగాడు,
నదులలోని నీటినంతటినీ తాగెయ్యసాగాడు.
అంతేకాదు, ఆ రాక్షసుడు చాలా దుష్టుడు కూడా.



అప్పుడప్పుడు అతడు ఇళ్లమీదకి దూకేవాడు-
ధడామ్!
రాక్షసుడికి అది వినోదంగా ఉండేది.
కాని అందరికీ అది విషాదాన్ని మిగిల్చేది.

ఆ రాక్షసుడు మాయలమారి కూడా.

అతడు కావాలనుకున్న ఏ రూపమైనా

ధరించగలిగేవాడు.

పులిలాగా మారగలిగేవాడు.





పెద్ద ఏనుగుగా మారగలిగేవాడు.

రాకాసి బల్లిగా మారగలిగేవాడు.





ఆ రాక్షసుడంటే అందరూ భయపడేవాళ్లు.

ఆ దేశ రాజు,

"త్వరలోనే తినటానికి, తాగటానికి

ఈ దేశంలో ఏమీ మిగలదు.

ఈ రాక్షసుడి పీడ విరగడ చెయ్యటానికి

ఎవరైనా సహాయపడగలరా?

అలా చెయ్యగలిగినవాడికి

నేను చాలా డబ్బులు ఇస్తాను,"

అని ప్రకటించాడు.

రాజు జారీ చేసిన ప్రకటన ఇలా ఉంది:






ఆ ప్రకటనని చిన్నా చూశాడు.

“నేను చిన్నవాడినే కావచ్చు,” చిన్నా అన్నాడు.

“కానీ నేను పెద్ద పనులు చెయ్యగలను.

ఇప్పుడు చేసి చూపిస్తాను.”

చిన్నా తన గురించి ఇలా రాసుకున్నాడు,






తరువాత చిన్నా ఒక సంచి తీసుకున్నాడు.
దాంట్లో పన్నీర్ ముద్ద పెట్టుకున్నాడు.
చూడటానికి అది తెల్లని రాయి లాగా ఉంది.
అలాంటిదే తెల్ల రాయి కూడా తీసుకున్నాడు.

తన సంచిలో చిన్న, గోధుమ రంగు పిట్టను పెట్టుకున్నాడు. అది చూడటానికి గోధుమ రంగు బంతి లాగా ఉంది. సంచిలో ఒక గోధుమ రంగు బంతి కూడా పెట్టుకున్నాడు.



తరువాత సంచిలో ఈగలను చంపే బద్ద పెట్టుకున్నాడు.



అమ్మా, నాన్నలకు చిన్నా

ఒక ఉత్తరం రాశాడు.

ప్రియమైన అమ్మా, నాన్న,

ఆ రాక్షసుడి పీడ విరగడ

చెయ్యటానికి నేను

వెళుతున్నాను.

మీ ముద్దుల కొడుకు,

చిన్నా




తరువాత చిన్నా తన సంచి,

తన గురించి రాసుకున్న ప్రకటన

తీసుకుని బయలుదేరాడు.




అతడు అలా నడుచుకుంటూ,

నడుచుకుంటూ వెళ్లాడు.

ఒక పెద్ద కొండ ఎక్కాడు.

అక్కడ రాక్షసుడి ఇల్లు ఉంది.

రాక్షసుడి ఇంటి తలుపును చిన్నా కొట్టాడు.

టక్ టక్. కానీ, ఎవరూ పలకలేదు.



చిన్నా మళ్ళీ తలుపు కొట్టాడు.

టక్ టక్ టక్.

అయినా ఎవరూ రాలేదు.

చిన్నా వెనక్కి తిరిగాడు.





అప్పుడు రాక్షసుడు వచ్చాడు!

"నువ్వు నా కోసం

వెదుకుతున్నావా?"

చిన్నాని అడిగాడు రాక్షసుడు.

"అవును," చిన్నా బదులు ఇచ్చాడు.

"నేను నీ కోసం వెదుకుతున్నాను."



“అలాగా, ఇంతకీ నువ్వు ఎవరివి?”

రాక్షసుడు అడిగాడు.

“నా ప్రకటన చదువు,” అన్నాడు చిన్నా.



రాక్షసుడు అది చదివాడు.

తరువాత పెద్దపెట్టున

నవ్వసాగాడు.

“హ- హ- హ- హ!

హొ- హొ- హొ- హొ!

హి- హి హి- హి!”

"ఏడేడు లోకాలలో నిన్ను
మించిన వాళ్లు లేరంటావు?"
అంటూ రాక్షసుడు
మళ్లీ నవ్వసాగాడు.
"హ- హ- హ- హ!
హో- హో- హో- హో!
హి- హి హి- హి!"





"నవ్వు ఎంతసేపైనా నవ్వుకో,"
అన్నాడు చిన్నా.
"కానీ, నీ కంటే నేను బలవంతుడిని.
ఆ విషయం నిరూపిస్తాను."

"అలాగా," రాక్షసుడు అన్నాడు.
"నా ఇంట్లో చాలా బంగారం ఉంది.
నువ్వు నాకంటే బలవంతుడవని నిరూపిస్తే
ఆ బంగారం అంతా నీ కిచ్చేస్తాను."

"నాకు నీ బంగారం ఏమీ అవసరం లేదు,"
చిన్నా అన్నాడు.





"అలాగా!" అన్నాడు రాక్షసుడు.
"నేనంటే భయపడుతున్నావన్న మాట!"

“లేదు!” అన్నాడు చిన్నా.

“నేను నీకంటే బలవంతుడిని.

కానీ, నీ బంగారం నాకు అవసరం లేదు.

నాకు ఏం కావాలో చెబుతాను.”

“అయితే చెప్పు,” అన్నాడు రాక్షసుడు.





“మా దేశం వదిలిపెట్టి చాలా దూరం వెళ్లిపోవాలి,”

అన్నాడు చిన్నా.

“నువ్వు మా ఆవులనన్నింటిని తినేస్తున్నావు.

గుడ్లనన్నింటిని తినేస్తున్నావు.

నదులలోని నీళ్లన్నింటిని తాగేస్తున్నావు.

నీకంటే నేను బలవంతుడనని నిరూపిస్తే

నువ్వు ఇక్కడినుంచి వెళ్లిపోవాలి.”



“సరే,” అన్నాడు రాక్షసుడు.

“నాకంటే బలవంతుడవని ముందు

నిరూపించు.”

“అయితే ఈ రాయి నువ్వు తీసుకో,”

చిన్నా అన్నాడు.

ఆ రాయిని తీసుకున్నాడు రాక్షసుడు.

“నేను కూడా ఒక రాయిని తీసుకుంటాను,”

అన్నాడు చిన్నా.

అతడు సంచిలోంచి పన్నీర్ ముద్దను

తీసుకున్నాడు.



"ఇదిగో చూడు. నా రాయిని పిండి నీళ్లు
తీస్తున్నాను," అన్నాడు చిన్నా.
అలా అంటూ అతడు పన్నీర్‌ని నొక్కాడు.
దాంట్లోంచి నీళ్లు వచ్చాయి.
"ఇప్పుడు నీ రాయిని పిండి
నీళ్లు తియ్యి," అన్నాడు చిన్నా.





రాక్షసుడు రాయిని పిండాడు.
దాంట్లోంచి ఏమీ రాలేదు.
తన బలమంతా ఉపయోగించి మళ్లీ పిండాడు.
కానీ ఒక్క నీటి బొట్టు కూడా రాలేదు.
రాక్షసుడి ముఖంలోని నవ్వు
మాయమయ్యింది.



"చూడు," చిన్నా అన్నాడు.
"నేను ఎంత బలవంతుడినో
మరోసారి నిరూపిస్తాను.
నువ్వు విసిరిన దానికంటే ఎత్తుగా
బంతిని నేను విసరగలను.
మళ్లీ కిందకి రానంత ఎత్తుకి బంతిని
నేను విసరగలను."

"నాకు కూడా అంత బలం ఉంది," అన్నాడు రాక్షసుడు.

"అయితే చూపించు," అన్నాడు చిన్నా.

చిన్నా తన సంచిలోంచి గోధుమ రంగు బంతిని తీసి
ఆ రాక్షసుడికి ఇచ్చాడు.
గోధుమ రంగు పిట్టను తీసుకుని, "నేను ఈ బంతిని
తీసుకుంటాను," అన్నాడు చిన్నా.

"నువ్వు ముందు విసురు," చెప్పాడు చిన్నా.





రాక్షసుడు విసిరిన రాయి పైకి, పైపైకి వెళ్లింది.
ఆకాశంలో అది ఒక చిన్న చుక్కగా మారింది.
బంతి ఎంత ఎత్తుకి వెళ్లిందంటే
అది కిందకి రావటానికి చాలాసేపు పట్టింది.



"ఇప్పుడు నా బంతిని విసురుతాను,"
అంటూ బంతిని విసిరాడు చిన్నా.
ఆ గోధుమ రంగు పిట్ట
ఆకాశంలో పైకి, ఇంకా పైకి, పైపైకి ఎగిరింది.
అది ఇంకా పైకి ఎగురుతూనే ఉంది.
అది ఆకాశంలో చిన్న చుక్కగా మారింది.
తరువాత అది కంటికి కనపడనంత పైకి ఎగిరింది.
రాక్షసుడు, చిన్నా పైకి చూస్తూనే ఉన్నారు.

"నా బంతి ఎంత పైకి వెళ్లిందో చూడు," అన్నాడు చిన్నా. "అది ఇంకా నేలకి తిరిగి రాదు."

"ఎందుకు రాదో చూద్దాం,"

అన్నాడు రాక్షసుడు.





ఆ ఇద్దరూ అలాగే చూస్తూ ఉన్నారు.

అలా చాలాసేపు చూశారు.

కానీ బంతి తిరిగి కిందకి రాలేదు.

"చూశావా?" అన్నాడు చిన్నా.

"నీకంటే నేను బలవంతుడిని!

నేను రాయిని పిండి నీటిని తీశాను.

నువ్వు తియ్యలేకపోయావు.

నీకంటే బంతిని చాలా పైకి విసిరాను.

కాబట్టి నువ్వు మా దేశం వదిలి దూరంగా వెళ్లిపోవాలి."

“లేదు! లేదు! లేదు!” అన్నాడు

రాక్షసుడు.

“నీకంటే నేను బలవంతుడిని.

నేను మాయలమారి రాక్షసుడిని.

నేను పులి లాగా మారగలను! చూశావా?”





“నేను ఒక అడవి ఏనుగుగా మారగలను!

చూశావా?”



“నేను రాకాసి బల్లిగా మారగలను!

చూశావా?”

“అవును,” అన్నాడు చిన్నా.



అప్పుడు చిన్నా ఇలా అన్నాడు, "నీది అద్భుతమైన మాయాజాలం. అయితే పెద్ద రాక్షసుడికి పెద్ద పులిగా మారటం చాలా తేలిక. కానీ, నువ్వు చిన్న పిల్లిగా మారగలవా?"

"ఓ," అన్నాడు రాక్షసుడు.

"అయితే చూపించు," అన్నాడు చిన్నా.



"చూశావు కదా," అన్నాడు రాక్షసుడు. "కాబట్టి, నాకు ఇష్టమైనంత కాలం నేను ఇక్కడ ఉంటాను. నాకు కావలసినన్ని ఆవులను తింటాను. నాకు కావలసినన్ని నీళ్లు తాగుతాను. ఇప్పుడు నేను ఒక పెద్దపులిగా మారి నిన్ను కూడా తినేస్తాను."

అప్పుడు రాక్షసుడు చిన్న పిల్లి లాగా మారాడు.

పిల్లి తల నిమిరాడు చిన్నా.





తరువాత చిన్నా ఇలా అన్నాడు,
"నీ మాయలు బాగున్నాయి.
కానీ, నువ్వు నిజంగా చాలా చిన్న
జీవిగా మారగలవా? ఉదాహరణకి,
ఒక చిన్న ఎలకగా మారగలవా?"

"ఆఁ!" అన్నాడు రాక్షసుడు.

"అయితే చూపించు," అన్నాడు చిన్నా.

అప్పుడు రాక్షసుడు చాలా చిన్న ఎలకగా మారాడు.

ఆ ఎలకకి చిన్నా చిన్న పన్నీర్ తుంపు ఇచ్చాడు.





"నువ్వు నిజంగా చాలా గొప్పవాడివి," అన్నాడు చిన్నా.
"అయితే ఒక పని మాత్రం నువ్వు ఎన్నటికీ చెయ్యలేవు."



"ఏమిటది?" రాక్షసుడు అడిగాడు.

"నేను చెయ్యలేనిది ఏదీ లేదు."

"కాదు," అన్నాడు చిన్నా.

"నువ్వు ఒక చిన్న ఈగగా మారలేవు.

అది నీక చాలా కష్టమైన పని."

"నేను ఈగగా మారగలను," అన్నాడు రాక్షసుడు.

"నాకు చూపించు," అన్నాడు చిన్నా.

అప్పుడు రాక్షసుడు చిన్న ఈగగా మారాడు. తరువాత......





....ఈగను చంపే బద్దతో

చిన్నా ఆ ఈగను చంపేశాడు!

దాంతో ఆ రాక్షసుడి పీడ విరగడ అయ్యింది!

అయిపోయింది